వ. అని యయ్యింతివలవంతసూచి నెచ్చెలులు వలుమాటలవలరాజు నుద్దేశించి.

గీ. పద్మభవునిమీఁదఁ బంకజోదరుమీఁద, హరునిమీఁద వేసినట్టిశరము
సబలమీఁదఁ జాల నదయత నేయంగ, బంచబాణ నీకుఁ బాడి యగునె.

వ. అని పలికి యేమిట నస్మగువనేన నుద్దీపించిన మదనతాపంబు వాయకున్న ని ట్లనిరి. ౨౬

చ. హరునిటలాగ్ని రూపఱియు నంగజుఁ డప్పుడ పుట్టె రాఘవే
శ్వరుఁడు శపించినం బికరవంబులు గ్రమ్మఱఁ గల్గె రాహు ని
ష్ఠురగతిఁ బట్టి మ్రింగినను సోముఁడు వెల్వడివచ్చెఁ జెల్లఁబో
విరహులఁ బొందియున్నశని పీడయు పీడద యేమిసేయుదున్. ౨౭

వ. అని పలికి యిందువదనకు మనసేయు చలిమందుల మదనతాపంబు దీపించె నింక నివి వల దని శిశిరోపచారంబుల వని చాలించి చింతింప దొడంగిన నక్కమలమంజరిం జేరం జని. ౨౮

మ. తరుణీ నే నొకసిద్ధపుంగవుని నత్యంతంబు సేవించి యే
నరు లేరూపులు సూడ నర్థివడినం దద్భావము గ్రాంతసే
వరుదారం బొడసూపవచ్చు వరవిద్య న్వేఁడికొన్న న్మనో
హరభావస్ఫురదింద్రజాలవరవిద్య న్నాకు నిచ్చెన్ దయన్. ౨౯

క. ఈపాలతికిఁ గమలాకర,రూపము తద్విద్యపేర్మి రూపెసలారం
జూపుదును దాన మన్మథ,తాపంబు శమించుఁ దెలివి దలకొను వసివన్.

క. ఆచెలువుని చిత్రాకృతి, చూచినయట్టిన రూపుచూచిన మరుచే
నేచంద మగునొ మాన్ప న,గోచర మున్మాదవృత్తి గూరినయేనిన్. ౩౧

క. అనునంతటఁ గమలాకరుఁ, డనుభూపతి వాహినీచయంబులతోఁ జెం
పినయట్ల వేత్రవతీవా,హినిదరి విడిసె నని పౌరు లెల్లన్ బెదరన్. ౩౨

క. నీ వరగుదెంచి తని హం, సావళి దెలివొందుటయును నానందలస
ద్భావమున నంతిపురమున, నావెలఁదిని గొనుచు బోటు లరిగెదు నంతన్.

గీ. అడుగఁ బుత్తెంచుటయుఁ గమలాకరునకుఁ
బుత్రి నీ నిశ్చయము చేసె భూమిపాలుఁ
డనుచుఁ బరిచారికలు చెప్పికొనఁ గడంగ
సతికి విధికృతి నాత్మ సంశయము పుట్టె. ౩౪

క. ఆకీరము చెప్పినకమ, లాకరుఁడో యున్నదేంద్రుఁ డన్యుఁడో యని చిం
తాకులత. గమలమంజరి, నీకడకుం బనుప మరుఁడు వికృతి యొనర్చెన్.

క. కమలాక్షికిఁ బ్రాణము ప్రాణము తత్సఖి కీడు సేయునా తలఁపఁగ నీ
కమనీయమూర్తివిభవము, కమలాననబాము మాన్పఁగలిగెఁ గుమారా.

క. నీకడిసియున్న యది హంసావళి విహరించు తోఁట యనవరతంబున్
భూపల్లభ యందాడుదు, మావనితయు మేముఁ జాల ననుమోదమునన్.

సీ. ఈచంపకముపొంత నీమావి క్రీనీడ మానినీరత్నంబు మరుని నోఁచె
నీమాధవీలత నీయశోకముతోడ నబ్జలోచన వివాహంబుచేసె
నీకేళికుళిలోన నెలనాఁగ ప్రోదిరాయంచలకవల నిందించి యాడె
నీపువ్వుఁబొదలలో నీరత్నవేదిపైఁ జెలువ బొమ్మలపెండ్లి చేసె మున్ను
భూపనందన యీసురపొన్నపొంత, మల్లియుఁబులకుందిరి ముదిత పెట్టెఁ
బ్రేమనాడెడుచోటనీచామచూపె, మానవేంద్రుని హృదయంబుమరులుకొనఁగ.

సీ. ఈ హంసయానంబు నింతయొప్పయి యున్న యతివయిక్కడ గెడయాడెనేని
యీపువ్వములతావి యింత లెస్సయి యున్న సుందరిసైతావి సుడిసెనేని
యీచిలుకల మాట లింత యింపయి యున్న వెలఁదితిన్నవిపల్కు వింటిమేని
యీ తేఁటిగమిచాయయింతయొప్పయి యున్న సుదతి వేవలిచూచిచూతుమేని
పూవుఁబోఁడి హంసావళి యీవనమున, నేడ్తవిహరింపకుండుట వీని కెల్ల
నింపు సమకూరెఁగాక యయ్యింతి యున్న
మనకు నింపుఁజేయునో యివి మానవేంద్ర. ౩౯

వ. అనిన మాటలు విని యనురాగంబు నివ్వటిల్ల. ౪౦

సీ. పొలఁతి కౌఁగిటఁజేర్పఁ బూచి నెత్తావుల క్రోవి యైనదియె యాక్రోవియొక్కొ
మానినీగండూషమధువునఁ బూచి పొగడనొప్పినదియీపొగడయొక్కొ
నలినాక్షిపదతాడనంబునఁ బూచి విశోకమైనదియె యశోకమొక్కొ
యెలనాఁగ మెఱుఁగుఁజూపులఁ బూచి భూజాతతిలకమైనదియె యీతిలకమొక్కొ
యివ్వనములోన నిన్నియు నెఱుఁగకున్నఁ, దరుణి కౌఁగిటఁ జేర్చినకురవకంబు
నాకుఁ జూపినఁ బరిరంభణంబు చేసి, నట్టులైనఁ గృతార్థుఁడ నగుదునబల.

క. అని యంత మదనతాపము, ఘన మగుటయు సైఁపలేక కాంతా నీనే
ర్చినయింద్రజాలవిద్యను, వనజాననరూపు చూపవలయు ననుటయున్. ౪౧

వ. తనవిద్యాప్రభావంబున రాజకన్యమోహనాకారంబు దృగ్గోచరంబుగావించిన.

క. వనజాస్యమోహనాకృతి, కనుఁగొని కతికౌతుకంబు గావించుటయున్
మనమున మాయారూపం, బని తెలియఁగ మఱచి చాల ననురక్తుం డై.

చ. తళతళఁ బర్వఁ గ్రొమ్మెఱుఁగుఁదండములం బరగించుమేని నుం
దళవమునందుఁ(?) జూపులు మనంబునుఁ జిక్కిచఁ గ్రమ్ముకొంచు లే
కలికులవేణి తెప్ప యిక కానరపాలుఁడు సూచుచుండె ని
శ్చలమతిఁ గాముతూపులకు జానుగ నిల్చిన దెప్పవో యనన్. ౪౫

సీ. కెత్తమ్మి రేకుల నెచ్చెలు లై యొప్పు మృదుపదంబులమీఁద మెలఁగి మెలఁగి
నునుచుంచు మించున గనకకుంభమ్ముల కెనయైనచనుఁగవ మెక్కి మెక్కి
కందని యిందుని యందంబు నొందిన చిఱునవ్వునెమ్మోముఁ జేరి చేరి
మెఱచిన తొలుకారుమెఱుఁగులకెనయైన చెలువుఁజూపులమీఁదఁ బొలసి పొలసి
ముద్దియనుపమానమోహనాకారంబు, చాల మరగి యానృపాలుచూక్షి
తీపులు గులుకఁ బుష్పఁదేనియ గ్రోలి మ, త్తిల్లి కదల నున్న తేఁటిఁబోలె. ౪౬

వ. ఇవ్విధంబున సంగజాధీనుండైన యమ్మానవేంద్రుండు. ౪౭

సీ. వనజాక్షి కెంగేలుఁ దనకేలుఁ గీలించి కేళికిఁ దివియంగ లీలఁ గదలు
నంగనామణి మోహనాంగవల్లికఁ జాల నాలింగనముసేయ నప్పళించుఁ
జెలువలీపారెడి చిగురాకుఁగెమ్మోవి నాదట గముకంగ నానసేయు
నెలనాఁగ మొలపాఱునిలచన్నుఁగవకాంతి ననుక్తిఁ గబళింప నగ్గలించు
నివ్విధముఁ దమక మెంతయు మిగులంగ, పతిదఁ జేరఁ గోరునవసరమునఁ
దోయజాక్షి రూపు మాయమై పోయినఁ, జాల జిచ్చవడు నృపాలసుతుఁడు.

వ. అయ్యింద్రజాలకలితమాయామోహంబని తెలియంగనేరక మదనావేశంబుకతం
బున హంసావళియ కా నిశ్చయించి యారమణి నన్నుఁ గారవింపంగాఁ ద
లంచి యవ్వనంబునం దాఁగెనని యూహించి పూఁబొదల నోలంబుల వెదకి
వెదకి యనుస్మారంబుం బొంది. ౪౮

సీ. అదె నాకు నెలుఁగిచ్చె సంగన యని యేగి కలకంఠమదియైనఁ గళవళించు
నదె మాటలాడెఁ జంద్రానన యని చే తుకభామిని యైన సొలపునొందు
నదె తలచూపె నీలాలక యని డాసి తుమ్మెదపొద యైనఁ దూలఁబోవు
నదె చీరఁ జేసన్న నబ్జాక్షి యని చేరి తెలమావిచిగురైన నిచ్చఁ గలఁగుఁ
దడవి కానని చోటను దడవఁబోవు, నేల పొడసూపి మాయమై తెంద్వధమున
నలఁపఁదగు నెహంసావళియనుచుదూఱు, భావజన్మాదుగారించు భూవిభుండు.

వ. ఇవ్విధంబున మన్మథోన్మాదబాణవిదారితమానసుండగుచుఁ గొంతతడవు వన్వ
నాంతరంబున జరించినంత నత్యంతశ్రాంతుండై భ్రమంబున వనంబును దప్పటికిం బఱ

తెంచి హంసావళీకన్య యున్నది యనుచుఁ బలుకు ముద్దుగా నన్నరనాథునితో
నిట్లనియె. ౫౧

సీ. అధిప హంసావళి యాబూరుగున నుండ కొకపువ్వుఁబొదలోన నుండి రాత్రి
యనలముచేత నీయాపదఁ బొందక బ్రదికియుండఁగఁ బ్రభాత వేళఁ
బూవులకై పువ్వులావికలేగి యాకోమలిఁ గాంచి తోడ్కొనుచుఁ బోయి
యంతఃపురంబున నడలెడుతల్లియు జనకుండు నున్నెడ గనుచుటయును
వారలెంతయు వెఱఁగంది వచ్చి గ్రుచ్చి, యెత్తి కౌఁగిటఁ జేర్చి యానంద మేర్చి
క్రమ్ముకన్నీటితో డుల నుమ్మలించి, యన్న బ్రదికి యేగతి వచ్చితమ్మ యనుచు

గీ. కన్ను నీరు దుడిచి కన్నియ నూరార్చి, పాపజాతి బోటిపాటుఁ జెప్పి
నేఁడు పెండ్లి యంచు నెమ్మి వుట్టగఁ బల్కి, వాఁడె మనకుఁ జెప్ప వచ్చె ననిన.

వ. ఆనందకందళితమానస యమ్మెక్క నప్పుడు దక్షుమూలవకేంద్రుండు విభవం
బున నక్షత్రములానవం దోకొని చని. ౫౨

క. తొడవులుతనులత నునిచినఁ, గనుకొప్పయి యుండి తొంటికం టెనురుచితోఁ
బడఁతుకయంగముతొడవులు, తొడవని మెఱుఁగులుకు వలుకుఁ దోవనై మెఱయున్

వ. ఇవ్విధంబున నచ్చెలు లచ్చెలువకు శృంగారంబు చేసి రయ్యవసరంబున నక్కడ.

సీ. వాహననికురుంబవల్లరీజృంభిత కాంచనకింకిణీక్వణనములును
మాణిక్యమండనమండితగాణిక్యమంజులమంజీరశింజితమును
వాంశికవైణికవందిబృందానేకవేణువీణాస్తుతిక్వాణములును
లాసికమోహనలాస్యలీలోచితమర్దళమురజాదిమహితరవము
కర్ణచామరసౌవర్ణకర్ణలలిత, వర్ణకంబళిభూషణవ్రాతకలిత
దంతిఘంటారవంబులుం దనరుచుండఁ, గదలెఁ జెంబడికొలుకు వేడ్కలుదలిర్ప.

ఉ. అంతఁ జిరంటికాజనము లల్లన వచ్చిరి రాజమందిరం
బంతకు నైనవస్తువులు కాంచనపాత్రలఁ గొంచు సంతతా
త్యంతలతాంతకోరకవిలాసమనోహరపల్లవావళీ
కాంతఫలావలుల్ దనరఁ గామమనోహరవల్లికాకృతిన్. ౫౩

సీ. ధమ్మిల్లములఁ బువ్వుదండలచెలువంబు మూపకప్రభలును సొబగు నొంద
నలికకస్తూరికాతిలకవిభ్రమములుఁ గుంతలరోచులుఁ గొమరుమిగుల
రంగారవలఁదిన యంగరాగంబులుఁ జీనాంబరంబులుం జెలువుమిగుల
భాసురమోహనాపాంగచురీచులుఁ గర్ణభూషణములుం గలసి మెఱయ

వంగదీప్తులుఁ దొడవులు నవఁగి పెనఁగి, విదితపార్వతీకల్యాణవిభవవినుత
గానములు కర్ణపర్వము ల్గాఁగ నడచు, పేరటాండ్రయందంబులు బెడఁగుఁ జేసె.

వ. ఇవ్విధంబున విభవంబులు మెఱయఁ బురంబుఁ బ్రవేశించిన వైభవసురేం
ద్రుండైన మాళవేంద్రుండు మించినపేర్మి నెదురు చనుదెంచి తోడ్కొని పోవం
దదీయమందిరంబు ప్రవేశించిన యనంతరంబున సర్వజనంబు లయ్యేలనాఁగ
వివాహవేదికాతలంబున నునిచి గంధవశం బెత్తించి యయ్యెడను వక్ష్యమా
ణుం దోడ్కొని యరిగిన. ౬౦

క. ఉండిరి కాంతయుఁ బతియును, గండవదము మాటునందుఁ గడునింపులతో
నిండితవేడ్కలు వసరఁగ, నొండొరులం జూడఁ గన్ను లువ్విళ్లూరన్. ౬౧

వ. అంతం బురోహితమంగళాచారానంతరంబ మౌహూర్తికదత్తశుభముహూర్తం
బునం దెరమెత్తించిన. ౬౨

సీ. లజ్జఁ గొండొకసేపు లలనదృగ్జాలముల్ తెప్పలలోనన యుప్పతిల్లు
విచ్చలవిడిఁబర్వ విభునివీక్షణములు మెలఁతమోహనమూర్తిమీఁదఁబర్వఁ
దనరెకు వేమకఁ దవ్వంగిచూపులు చెలువునిమోముపైఁ జాలసి మగుడఁ
జూపులు దార్కొన సుదతీలలామంబు లలితంపు సిగ్గునఁ గళవళించు
వపువు దనుచందములు చూచి యలరుప్రోడ
యలరుఁబోఁడులసరసోక్తు లమృతరసము
సోన లొలికించె నంతయు సొబగుమిగిలి
తమకు నవ్వును చెవుల కుత్సవ మొనర్ప. ౬౩

సీ. వల్లెరంబులనున్న ప్రాలు దోయిటముంచి పాణిపద్మంబులు భ్రమలు నింద
సేసలు వెట్టంగఁ జేతు లెత్తి చోటఁ గరమూలరోచులు గ్రమ్మదేర
చేర(తె)గ్గుదెచ్చుచో సితకటాక్షంబుల మించి నీరెండల ముంచికొనఁగఁ
దలఁబ్రాలపందనఁ జెలువపయ్యెదవాసి యుబిచన్నుఁగవకాంతి గిలికొనంగఁ
దాముఁ జయ్యన ధవళాక్షతలు ధరించి
పాలఁతిమాళిపై నినుపారఁ బోయ మిగులఁ
బాటలాసితసితహరిత్ప్రభలు దనరఁ
బాటవము లేక పతి తొట్రుపాటు నొందె. ౬౪

క. తలఁబ్రాలు వోయఁ దగ్గర, జలజంబులపొందు పతికి జలజాననకున్
దళముగ సకలాంగములను, బులకాంకురవితతి నాటుకోయుచునుండెన్.

వ. ఇవ్విధంబున మహోత్సవానందకందళిత మానసు లైన యాదంపతులకు హోమానంతరంబ మాళవేశ్వరుం డనేకకరితురగ రత్నభూషణ చీనాంబ రాది మనోహరధనం బరగంబిచ్చి వందిమాగధాదిజనంబుల కభీష్టధనంబు లొసంగి యాదట నన్నపానాదులం బరితృప్తులం జేసి దంపతుల నగ్గనుందిరం బుల నునిచె నయ్యవసరంబున. ౬౬

సీ. అబ్ధిసుసాంధ్యసేవాభిషేకమునకు జలధి ముంచిన హేమకలశ మనఁగ
జలధియుద్యానభూజంబున రాలిన బంధురపరిపక్వఫల మనంగ
నంబుదదంతి గోరాడ నంబుధిఁ బడ్డ యపరాద్రిధాతురాగాశ్మ మనఁగ
వరుణకుటుంబినీకరతలంబునఁ దప్పి పడినమాణిక్యపుబంతి యనఁగ
వారుణీసక్తుఁ డై జాతి వనజబంధుఁ, డపరగిరిమీఁదఁ గాల్జారి కడ్డిఁబడియె
వారుణీసక్తు లై పెఱవార లెల్ల, చక్క నిలువంగ నేర్తురు నిక్క మరయ.

క. దినలక్ష్మి యినుఁడు చనుటయు, ననుగమనము సేయఁ బశ్చిమాచలమున నొ
ట్టిన మెఱమంటలపోలిక, ఘనసంధ్యారాగరుచులు గడు నొప్పారెన్.

గీ. మించె నెఱసంజ లడరి యామీఁదఁ దార, లల్లనల్లనఁ దోతెంచెఁ బెల్లుగాఁగ
నూతనంబుగ నంబరానోకహంబు, చిగురు నిండారఁ బెట్టి పూచెనో యనంగ.

గీ. జలరుహములు సూర్యబలమేమియును లేమిఁ, జంద్రుఁ డొప్పుకునికిఁ జాలఁ గుందె
గ్రహబలంబు లేనికాలంబు నెంతటి, సిరులు గలుగువారుఁ జిక్కినదరె. ౭౦

సీ. మధుపసంఘంబులు మట్టితుల్లాడుచుఁ గువలయంబులు చూఱగొనఁ దొడంగె
ద్విజకోటి సన్మార్గవిహరణంబులు దక్కి యడఁగి కుజాతుల నాశ్రయించెఁ
బతులచేరువ లేనిభామల దుర్గతి మారుండు భీతి నిండారఁ జేసెఁ
గులశీలవిధములఁ దలఁపంగ నేరక జారచోరావలి సంచరించె
మహీవివేకులు ఘనతమోమార్గులైరి, యేకపక్షత వాటిల్లె లోకమునకు
నధికతేజస్వియగు నినుఁ డస్తమింప, దివి యరాజక మై యున్న యవసరమున.

ఉ. శాంతము లైనశాతురలతావులు సేవలు దక్కి పోవఁగా
నంతట వచ్చి చొచ్చి మధుపావళి గ్రోలుచు సోలుచుండఁగాఁ
గాంతవనాంతరాంతరవికాసనివాసవిజృంభమాణసా
యంతనమల్లికాకుసుమహారిమనోహరసౌరభావలుల్. ౭౧

సీ. ఇది చను దెంచె నే నేగరా దనిరెమ్మి తోయజబంధుండు తొలఁగిపోయె
నిది తను మాపటిఁ బొడ లెడు ననియెమ్మి రాజు రయంబున రాక తడసె

నిది వెనుదగిలిన నేగరా దనియొక్కొ చుక్కలు దీనిలోఁ జొచ్చి వెలసె
నిది గ్రుంగు ననియొక్కొ యివ్వుకుదీపమూపమున నిండులుసొచ్చెఁబవనబంధుఁ
డనఁగ దెస లెల్లఁ గస్తూరి నలఁదినట్లు, మింట నెల్లను గాటుక మెత్తినట్లు
నుర్వి గలయంతయును నీలి నూఁచినట్లు,నంతకంతకు నగ్గలమయ్యెఁ దమము.

వ. అయ్యవసరంబున. ౭౪

సీ. సిరితోడఁ బుట్టువు చెంగల్వ చెలిపొందు ప్రాపుసంగడము తమ్మునకు నెలవు
చీకఁటి మూఁకలఁ జెండాడి నెఱరాతు మున్నీటి నుబ్బించుముద్దుఁబట్టి
యుమపాలికన్ను పున్నమతేఁకు వెన్నుని ఐయ్యంబు తామరవిరులగొంగ
మున్కంటితలపూవు చుక్కలయేలిక వెన్నెలకంటువు వేల్పుబువ్వ
కూడి పాసినవారలగుండెదిగులు, పాసి కలసినవారలపాలియింపు
పాడుపుఁగొంపున సెంతయు బెడఁగునొంది
మన్మథునిమామ యగుచందమామ పొడిచె. ౭౫

గీ. పూర్వగిరి పానవట్టమై పొలుపుమిగులఁ, బన్నరాగలింగమువోలెఁ బ్రబలె రాజు
పూజచేసిన నవకంపుఁ బూవులట్లు, లుకటితలమునఁ దారక లొప్పు మిగిలె.

చ. సలలితలీలఁ బ్రాగ్వనితఁ జాలఁగ రాగముఁబొందఁ జేసి యిం
పొలయఁ గుముద్వతీపతికి నుల్లసనం బాదవంగఁ జేయుచు
న్విలసితతారకాంగనల వెన్నెలగందపుఁబూఁతచేతఁ జె
ల్లలరఁగఁ జేసె నప్పు డమృతాంశుఁడు దక్షిణనాయకాకృతిన్. ౭౭

... ... (గ్రంథపాతము) ... ...

...సంతోషంబు నిగుడుచుండ వైభవముతోడ శృంగారవనము సొచ్చి

సీ. మంజీరమంజుల శింజితంబు చెలంగ
లవిందులు చేసి పూవుఁదీఁగెలపొంతఁ బొలసిపొలసి
నరుపారనిండు వెన్నెలచల్లు చూపుల సొంపార మానిభృ చూచిచూచి
విరులు వేసుకఁ గోయఁ గరము
...టలోఁగరము చేర్చఁ, దిరుగుచున్నట్టినిర్ఝరతరుణు లనఁగ
నవవికాసంబు గతులకు నవక మొసఁగ, వనములోపలఁ దిరిగిరి వనజముఖులు.

సీ. పొగడంగ దుచువారు
నోపాటలాధర యీపాటలము నీవు ముట్టకు మనియొట్టు పెట్టువారు

రాజాన యనుచు నీరాజాననఁ దొలంగ దటుచూడు దీని
శేనె చెలు లిందు రండని చీరువారు
మరయుపువ్వులుగనుఁగొని మెచ్చువారుఁ, జిలుకబోదలఁ బట్టంగఁ జేరువారు
నగుచు నెంతయు వేడ్కల నతిశయిల్ల... ౭౯

సీ. నొకకొంత మోపి నిక్కుటయును మంజీరములు తొలిమాటనలుప
వామకరంబులఁ వరశాఖ లూఁదిన మణిముద్రికలదీప్తి మాటుమలయఁ
బూవులకందువఁబొ
గరములల్లన మెత్తి కిరులు గోయఁగఁబూన దోర్మూలరోచులు తొంగలింపఁ
గుచములొకటి నొక్కటి మీఁదిక్రొత్తనగయ
వలుల జాడలు గనుపట్టి వెలయుచుండ, ... కేలిసలిపిరపుఁడు. ౮౦

ఉ. సన్నపుఁగొనుమీఁద వలిచన్నుల ప్రేఁగు ఘనంబు నెవ్వఁడిం
దన్నరు మన్మ మోహకచతామరసానన యంచు భీతితోఁ
దన్నొకబోటి ... ... ...
... ... ధజనతాకృతిశోకమునయ్యశోకముల్. ౮౧

సీ. ఎలసంజపర్వ నదేలకో మొలసంజ గాదిది చిగురాకుగముల పెల్లు
చిగురాకుపైఁ దనుశ్రేణి యిట్లుదరునే తమముగా
...డునేతారక ల్గావిలి కోరకములు
కళికలమీఁద వెన్నెల లుద్భవించునే వెన్నెల గా దిది విరులసొబగు
లనుచు ముగ్ధలు వలుకంగ నతివిదగ్ధ,లల్ల నవ్వచుఁ దెలుపుదు ర...
, లు దిక్కులనుం జూపువలపునపుడు. ౮౨

క. డోలాలీల లొనర్చుచుఁ, గేళీసదనంబులందుఁ గ్రీడింపుచుఁ గ్రీ
డాలాపములకు మెచ్చుచు, నాలేమయుఁ బతియు... ౮౩

సీ. (నీకటాక్షంబులు నెర)సినయెడ లెల్లఁ గలువలుపూచిన కరణినుండు
నీమేని నత్తావి నగడిన నేపూవు లైనను మంచి వైనట్లు దోఁచు
నీయంగములకాంతి నిండిన లత లెల్లఁ గనకంపులతికలఁ (కరణి వెలయు)
జిగురుల పోల్కినుండుఁ
జెలిసి తెలిసికోయనకానియులరు లెపుడుఁ, గోరివిచ్చలవిడిమాకుఁగోయరాదు
నెలఁత నీపొత్తు గలయము నేఁటి కనుచుఁ, బాలఁతినొక్కరె... ౮౪

రామునిగుణములు, సింహములరాత్రిత, ఙేసః=చతుర్థికి, కైకొఅకూ=కై, కొఱకు-ఇవి వచ్చును. రామునికై, రాములకై, రామునికొఱకు, రాములకొఱకు, కడమవియు నిట్లే తెలియునది. ఙసిసః=పంచమికి, వలనః=వలన యనునది, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. రామునివలన, రాములవలన.

---

నః కౌ ఙసః కు రనితాముందు ఙిప స్సవిధవర్తినామిందు

ఇవి నాలుగుసూత్రములు. కౌ=కు అను విభక్తిపరమైయుండిన, నః=న, అనునాగమము వచ్చును. ని అనునది రాదు. అనితాం=ఇకారాంతవ్యతిరిక్తములైన నామములయొక్క, ఙసః=షష్ఠికి, కుః=కు అనునది వచ్చును. రామునకు. సామాన్యాకారమున న్యాగమము వచ్చిన నకారాంతరూప మగుచున్నది, కనుక, అనితాం అనువర్త్యదానచేత కు రాదు. ఙసఃకిశ్చ-అను సూత్రమున, కి వచ్చును; రామునికి. అప్యూహకమునకుఁ గలదు, రాములకు. ఙిపః=సప్తమికి, అందు=అందు, అని వచ్చును. రామునియందు, రాములయందు; న్యాగమము నంగీకరింపనివారిపక్షమున, నుడ్వోచ్చారః, అని నుప్పు వచ్చిన రామునందు అని కలదు. స్థానబలమునందు, అందు అనియుఁ గలదు. టాస్-మొదలైన విభక్తిసంకేతములు ప్రాకృతశాస్త్రప్రసిద్ధములు. సవిధవర్తినాం=సమీపవర్తులకు, సప్తమ్యంతము-ఇందు=ఇందు అనునది కలదు. ఇందు భుజించె. ఇందు శయనించె.

---

తోడ సహార్థేటాసః పట్టేతి చ పఞ్చమీ గుణే హేతౌ. ౭
కంటేన్యారాదాదే ల్లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ.
యొక్క చ శేషే.షష్ఠీ. విషయనిమిత్తాదిజా తథైవా న్యా॥ ౮

ఈవాక్యత్రయమూఁడు సూత్రములు. సహార్థే="సహయుక్తేప్రధానే" అనుశబ్దసూత్రమున వచ్చు, టాసః=తృతీయకు, తోడ=తోడ యనునది వచ్చును. శిష్యులతోడ వచ్చె. గుణే హేతౌ="విభాషా గుణే స్త్రియాం" అను శబ్దసూత్రమున వచ్చునట్టి-పఞ్చమీ=పంచమికి, పట్టి ఇతి=పట్టి యనునది వచ్చును. గుణముంబట్టి ధన్యుఁడు, జ్ఞానముంబట్టి ముక్తుఁడు. అన్యారాదాదేః="అన్యారాదాదిషు" అను శబ్దసూత్రమున వచ్చెడుపంచమికి, కంటె=కంటె యనునది వచ్చును. రామునికంటె నన్యుఁడు, వనముకంటెఁ జేరువ. నిర్ధారణోద్భవా="యతశ్చ నిర్ధారణం" అనుశబ్దసూత్రమున వచ్చెడు షష్ఠికి, లోపల=లోపల యనునది వచ్చును. దేవతలలోపల గౌరి యధికురాలు. శేషేషష్ఠీ=

శేషార్థమందు వచ్చుషష్ఠికి, రొక్క=యొక్క యనునది యగును. అంబయొక్క దాసుఁడు. విషయనిమిత్తాదిజా=విషయనిమిత్తాద్యర్థములం బుట్టిన, అన్యా=సప్తమికి, తథైవ=అట్లాగుననే యుండును. హరివిషయము, హరినిమిత్తము, ఆదిశబ్దముచేత నఖిసప్తమియును వర్తమానార్థ మయినదే యుండును. హరిరక్షించుచుండఁగాను.

---

స్యాదమహాత్మాం విభక్తౌ సోర్బ్వము తదుపరి పునర్బుబా ప్రాచామ్
సోర్లు గిత ఉ ర్బహుత్వే సమ్బుద్ధౌ నా దితాం ఙసః కిశ్చ. ౯

ఇది యాఱుసూత్రములు. అమహాత్మాం=అమహాత్ములకు, విభక్తౌ=సప్తవిభక్తులును బరమై యున్నపుడును, సోః=ప్రథమైకవచనమునకు, ఆదేశమై, ము=ము అనునది, స్యాత్=అగును. వనము, ప్రథమైకవచనాదేశము. వనములు, వనమును, వనముచేత-ఇత్యాది, తదుపరి=దానిమీఁదను, పునః=తిరుగ, ముఃబూ=ము, బు అనునవి వచ్చును. అని, ప్రాచాం=పూర్వులయొక్క మతము. వనము+ము, అని యుండిన, మొదటి ము, సున్నయై ద్విత్వమాయెను, వనమ్ము; బు, ఉండిన నట్లే వనంబు అని రూప మాయెను. ఇతః=ఇకారాంతముమీఁద నుండెనేని, సోః=ప్రథమైకవచనమునకు, లుక్=లోప మగును. హరి, గిరి. బహుత్వే=బహువచనమందు, ఉత్=ఉకారము వచ్చును. హరులు, గిరులు. ఇతాం=ఇకారాంతములకు, సమ్బుద్ధౌ=సంబుద్ధిపరమై యుండిన, అత్=అదాగమము, న=లేదు. ఓహరి, ఓగిరి. ఙసః=షష్ఠ్యేకవచనమునకు, కిఃచ=కి, అనునది యాదేశమై వచ్చును. హరికి.

---

టాదా వితో నఖిస్స్యా దీదన్తా ఇద్వదేవ కృతహ్రస్వాః
వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్. ౧౦

ఇది నాలుగుసూత్రములు. ఇతః=ఇకారాంతమునకు, టాదౌ=తృతీయాదివిభక్తి పరమై యున్న, నిః=న్యాగమము, నస్యాత్=లేదు. హరిచేత, హరివలన. కృతహ్రస్వాః=అనంతరసూత్రముచేత హ్రస్వముం బొందిన, ఈదన్తాః=ఈకారాంతములును, ఇద్వదేవ=ఇకారాంతములవలెనె యుండును. సేనాని, అగ్రణి. వికృతౌ=తెనుఁగునందు, క్వచిత్=ఒక్కొక్క చిక్కున, మోః=మూఁకు, లోపః=లోప మగును, ఆదిమస్య=ఆమొదటనుండెడు, అతః=అకారమునకును, దీర్ఘశ్చ=దీర్ఘమును వచ్చును. చకారము వలన వికల్ప మనుట, జంపాలు, జోంపాలు.

---

సర్వత్రోదోతోర్వుర్భవతి మువ ద్దుగ్బహుత్వదానాం వా
డుజతౌతు నప్లుతస్స్యా త్సమ్బుద్ధా వితృతాం విదుః కేచిత్. ౧౮

ఇది మూఁడుసూత్రములు. ఉదోతోః=ఉకారాంత, ఓకారాంతము లకు, సర్వత్ర=సప్తవిభక్తులయందును, వుః=వు, అనునది, మువత్=ము, అను దానివలెనే, భవతి=అగుచున్నది. ప్రథమైకవచనమున కాదేశ మయ్యెను గనుక మహోటుల విభక్తి దాపయి యును వచ్చు ననుట. గురువు, వస్తువు, ధేనువు, గురువులు, గురువులచేత-ఇత్యాది. ఓకారాంతమునకు, గోవు, గోవుచేత. మహత్పదానాంవా డుక్-మహత్పదానాం=మహత్పదములకు, వా=వికల్పము న, డుక్=డుక్కు వచ్చును. విష్ణుఁడు, విష్ణువు, శంభుఁడు, శంభువు. సమ్బుద్ధా= సంబుద్ధియందు, ఉతాం=ఉకారాంతములకు, డుజతౌతు—డుజ్=డుజ్జును, అత్=అదాగమమును, న=లేవు, ప్లుతః స్యాత్=అంత్యవర్ణమునకుఁ బ్లుతము వచ్చును. ఇతి=ఇట్లని, కేచిత్=కొందఱు, విదుః=తలంతురు. ఓవిష్ణూ! 3, ఓశం భూ! 3. ఇందుకుఁ బ్రయోగము వాగనుశాసనులు తామే చెప్పినారు. "జర త్కారూమునిశ్రేష్ఠ"-"జరత్కారు ర్జరత్కార్వ" అని వ్యాసులు చెప్పినారు. కనుక, ఉకారాంతములు, "కేచిత్" అన్నాఁడు గనుక విష్ణుండ అనియు నుంగలకు.

---

దీర్ఘాణాం హ్రస్వస్స్యా న్నచ దేశ్యపదే నచైకవర్ణేపి
డా బవిధాత్రాదేరు స్తస్యచ వా తౌ వుభౌ రమేశసమౌ. ౧౯

ఇది యాఱు సూత్రములు. దీర్ఘాణాం=దీర్ఘములకెల్ల, హ్రస్వః-స్యాత్= తెనుఁగున హ్రస్వమగును. అంబ, లక్ష్మి, కరభోరు. దేశ్యపదే=దేశీయపుఁదె నుఁగునందు, న చ=లేదు. నవలా, నేఁడూ, లకోరీ, ఇత్యాది- ఏకవర్ణేపి=ఏకా క్షరతత్సమమందును, నచ=లేదు. శ్రా, శ్రీ, స్త్రీ. డాప్, అవిధాత్రాదేః, ఉః=అవిధాత్రాదేః=విధాత్రాదిగణవ్యతిరిక్తమైన, ఉః=ఋకారాంతమునకు, డాప్ =డాప్ అనునది యాదేశము వచ్చును. డాప్ కో డకార పకారములు పోఁగా, ఆ- యని శబ్దశాస్త్రన్యాయమున ఋకారమును గొట్టి నిలువఁగా-కర్త, ధాత. తస్యచ=ఆవిధాత్రాదికిని, వా=వికల్పమున, డాప్ వచ్చును. : ధాత, మాంధాత. తౌ ఉభౌ=అడాబంతౌ ఉడాబంతములు, రెండును, రమేశసమౌ=రమాశబ్ద, ఈశశబ్దములవంటి వౌను. విధాత యనిన రమాశబ్దమువంటిది. విధాతృఁడు, ఈశశబ్దమువలెనే యకారాంతమై యుండును.

---

క్వచి దమహతోఽపి డుక్ స్యా దేకాదే రమహతాంచడావున్న
స్త్రీత్వ బహుత్వే సురాదే రసమాసే లుగ్భవే త్కుశాదే ర్మోః. ౧౩

ఇది నాలుగుసూత్రములు. క్వచిత్ = ఒక్కొక్కచోట, అమహతోఽపి = అమహత్తునకును, డుక్ స్యాత్ = డుక్ వచ్చును. పుట్టినెయ్యుఁడు, వనపుయ్యుఁడు. ఏకాదేః = ఏకాదిగణమునకును, అమహతాం చ = అమహత్తులకును, డౌ = డుక్ పరమై యుండిన, ఉత్ = ఉకారము, న = లేదు. ఏకాదులు - ఒక్కరుడు, మూఁడు, మఱియుండు, పాఱుండు, ఇత్యాది. కత్తెఱుడు, కొఱఁడు, జన్నఁడు, అశ్వవాచకములు. వీనికన్నిటికిని, క్వచిదమహతోఽపి డుక్ స్యాత్, అని డుక్ వచ్చును. సురాదేః = సురాదిగణమునకు, అసమాసే = సమాసముగానియప్పుడు, స్త్రీత్వబహుత్వే = స్త్రీలింగమును బహువచనమును నగుచు - సురలు. సమాసమైన భూసురుఁడు. సురాదులు ప్రయోగముచేతఁ దెలిసికొనునది. కుశాదేః = కుశాదిగణముయొక్క, మోః = మూకు, లుగ్భవేత్ = లోప మగును. కుశ, దర్భ, హంస, దూత, ఇత్యాది.

---

షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యా ద్వ్యవహితాశ్చ సర్వేస్యుః
వికృతౌ చ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గకసర్వనామధేయాస్స్యుః. ౧౪

ఇదిమూఁడుసూత్రములు. షష్ఠీవిశేషణానాం = షష్ఠ్యంతములయొక్క విశేషణములకు, ప్రథమా స్యాత్ = ప్రథమ వచ్చును. "శిష్టవత్సల గౌరి కాత్రి తుఁడ నేను". సర్వే = సర్వార్థకవిశేషణములును, వ్యవహితాశ్చ = విశేష్యముతో వ్యవధానము గలిగియును (అడ్డముగలిగియును) నుండును.

గీ. అత్రి తావన సురల మున్నంబ్రోచె, శంకరుసిరాణి నర్చింతు శైలసుతను
ఇందువదనకుఁ బణతి సర్వేశ్వరికిని, యాద్యయుం దనురక్తిమాయార్యయందు.

స్త్రీలిఙ్గాః = స్త్రీలింగపదములు, వికృతౌ చ = తెనుఁగునందును, స్త్రీలిఙ్గకసర్వనామధేయాః = స్త్రీలింగము లైనవిశేషణవిశేష్యములుగలవి, స్యుః = అవును. చకారమువలన సంస్కృత స్త్రీలింగపదవిశేషణములు స్త్రీలింగము లే యనుట. గౌరి భక్తవత్సల, గట్టురాపట్టి యాపన్నవరద.

---

ఉభయవిధ మమహతీనాం నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్
ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాంస్యాత్. ౧౫

ఇది నాలుగుసూత్రములు. అమహతీనాం = అమహత్తులైన స్త్రీలింగములకు, ఉభయవిధం = పుంలింగ స్త్రీలింగరూపవిశేషణములు రెండును గలవు.

శరచ్చంద్రిక మనోహరము, పుష్పలత మనోహర- సర్వాసాం = స్త్రీవాచక ములైన తెనుఁగు సంస్కృతముల కన్నింటికి, విశేషణములకు, స్త్రీప్రత్యయః = ఙీప్, ఙీషులు మొదలైన స్త్రీ ప్రత్యయములు, నియతః=ఆవశ్యకము. శరచ్చం ద్రిక తాపహారిణి, మున్నేరు శివజటాజూటవాసిని, అంబ సకలజగత్కర్త్రి. ద్వితీ యా=ద్వితీయావిభక్తి, ఇతరత్ర చ=తన చోటఁగాక కడమవిభక్తులచోటను వచ్చు ను. హేలిని నణఁకెను, తృతీయయందు ద్వితీయ. ద్వారక నున్నాఁడు, సప్తమి యందు ద్వితీయ. జడపదానాం=జడపదములయొక్క, తస్యాః =అద్వితీయకు, ప్రథమాచ = ప్రథమావిభక్తియును, స్యాత్ = అగును. కొండదిగె, రథ మెక్కె- చకారమువలన ద్వితీయయు నుండును. వనమును జేరె.

ప్రోవావో రైనావోః స్త్రీవద్గ్లో ర్భూదివోస్తు జౌయత్తత్

వాయిరవు ర్వక్రతమో ఽప్యుద్ద్వన్ద్వే ఽరః క్వచిద్గకారో వః. ౧౬

ఇది యాఱుసూత్రములు. రైనావోః=రై శబ్ద నౌశబ్దములకుఁ దుదను, అవావా=ఓ కారమును, అవయవసదియు (ఓ + అవ, అవావా)స్తః=అగును. రో, నావ- గ్లౌః=గ్లౌశబ్దము, స్త్రీవత్ =స్త్రీశబ్దమువంటి దాను, ఏకాక్షరమై నిలుచు ననుట, గ్లౌ. భూదివోస్తు=భూ, దివ్ శబ్దములకు, జౌ=సంస్కృతము లో సప్తమ్యేకవచనమందు, యత్=ఏరూపమో, తత్=ఆరూపమే యగును, భువి, దివి. వక్రతమా=ఐ, ఔలు, వా=వికల్పమున, అయి రవుః=అయి, అవు, అని యుండును. కైలు, కయిలు; కౌరా, అవురా. ద్వన్ద్వే=ద్వంద్వసమాసమం దలి, ఉః=ఋ కారమునకు, క్వచిత్ =కొన్నిచోటుల, రః=రేఫమగును. మాత్ర పితృభావనను కైలపు త్రిఁగొలుతు. కొందఱు క్వచిచ్ఛబ్దము నుత్తరమునకే యన్వయించుకొందురు. గః=గకారము, క్వచిత్ =కొన్నిచోటుల, వః=వకార మౌను. ప్రేగులు, ప్రేవులు; తోఁగలు, తోఁవలు; పగలు, పవలు; ఇత్యాది.

సన్తాన్నామ్నః కుజ్నోర్బహువచనే కుత్రచిన్నులోపశ్చ

సలలో ప్యస్తుయుతో ఽథ కార్త్వ లులతో గల్లుగపి తయోః పరతః. ౧౭

ఇది మూఁడుసూత్రములు. సన్తాత్ =నుకారము తుదయందుఁ గల, నామ్నః=శబ్దమునుండి, నోః=నుకారమునకు, బహువచనే=బహువచన మం దు, కుజ్ =కుజాదేశ మగును. జకార మిత్తయిపోయిన, కేత్తు గనుక యర్థబిం

దుయుక్తమగును. *కొలను, కొలంకులు; కెలను, కెలంకులు, మ్రాను, మ్రాంకులు; క్వచిత్ =కొన్నిటియందు, నులోపశ్చ=నుకారలోపమును నగును. చేను, చేలు; మీను, మీలు. చకారప్రయోగముచేతఁ గొన్నింటికి లోపము లేదు. మేనులు, కొనులు. ఉలయోః=లు, ల, అనునవి పరమైయుండిన, నలలోః=లకారయుక్తమైనలుకారమునకు, వా=వికల్పమున, బిన్దుయుతః=సున్నతోఁగూడిన, డుః=డుకారము, వచ్చును. తయోః=అలులలకు, పరతః=పరమైయుండెడు, ఉల్లుగపి=ఉకారలోపము నగును. విల్లు, అనులకారయుక్తమైనలూకు విండులు, అని వచ్చును. ఉకారలోప మైన, విండ్లు, అని వచ్చును. వికల్పము గనుక విల్లును గలదు. ముండ్లు, ముండ్ల, ముండ్లమ్రాను, "బహువచనే" అనుపదమనువర్తించుచున్నది.

---

నిత్యం దారాదేశ్చ స్యాల్లో ర్లులయో రుకారాచ తత్రస్తః

రోలో డలటాం ముదితాం తస్య చవా లుక్సలోలోశ్చ. ౧౮

ఇది నాలుగు సూత్రములు. దారాదేశ్చ=దారాదిగణముయొక్క, లోః=లుకారమునకు, ఉలయోః=లులలుపరమైయుండిన, నిత్యం=నిత్యముగాను, బహువచనే=బహువచనమునందు, డుః=డు అనునది వచ్చును. (బహువచనదువర్ణకము లనువర్తించుచున్నవి) దారాదు లనఁగా, అలు మొదలైన తెనుఁగు శబ్దములు. తత్ర=ఆదారాదులయందలి, ఉలయోః=లు, ల, యనువానికి, రుకారాచ=రు, ర, యనునవియు, స్తః=అగును. ఆండ్రు, జవరాండ్రు, కోడండ్రు, చెల్లెండ్రు; వాండ్రు, పీండ్రు, విలుకాండ్రు, అనుస్థలములడకారము మునుపే యున్నది. దారాదులలోనివి గనుక రురలు వచ్చినవి. రః=ర అనుదానికి, లులలుపరమైయుండిన, లః=శకారము వచ్చును. గోరు, గోళ్ళు; ఏఱు, ఏళ్ళు; ఉత్తరసూత్రముచేత, ఉకారలోపమైనది. డలటాం=డ, ల,ట, అను నీమూఁటియొక్క, ఉదితాం=ఉకార, ఇకారములకు, తస్యచ=మునుపటిసూత్రమునందుఁజెప్పఁబడిన, రు అనువానియొక్క యుకారమునకు, వా లుక్=వికల్పముగ లోపము వచ్చును. వికల్పము గనుక గోరులు అనియుం గలవు. రః=అని పొల్లు రేఫ చెప్పినాఁడు గనుక, ఉకారలోపము లేనప్పుడు లకారాదేశము రాదు. పాడి, పాళ్లు; త్రాడు, త్రాళ్లు; అంబలి, అంబళ్లు; చాలు, చాళ్లు; చెట్టు, చెట్లు; పెట్టె, పెట్లు; జట్టి, జట్లు; పెంటి, పెంట్లు; ఇత్యాది. నలః=లకారయుక్తమైన, లోశ్చ=లుకారమునకును, ఉకారలోపమగును. పందిళ్లోని, అంబళ్వార్చి.

---

* కొలను, కొలంగ్ కులు; కెలను, కెలగ్ కులు, మ్రాను, మ్రాగ్ కులు-పా.

ఔపవిభక్తికలీనా మిల్లు గ్బహులం తత్రైవ దుశ్చ స్యాత్
అపి సంయుక్తసమాప్తౌ భూయోఽన్తే లుక్ప్రదృశ్యతే నామ్నామ్. ౧౯

ఇది రెండు సూత్రములు. ఔపవిభక్తికలీనాం=ఔపవిభక్తికములయం దలి లి యనునక్షరమునకు, ఇల్లుక్, బహుళం=బహుళముగా, ఇకారలోపమగును. తత్రైవ=అలాగుననే, దుశ్చ=దుకారమును, స్యాత్=అగును. గుద్దలి, ఇకారలోపమై, దుకారము వచ్చి, గుద్దండ్లు, గొడ్డండ్లు, రోకండ్లు, ఇత్యాది బహుళగ్రహణముచేత, పందిలి-ఔపవిభక్తికమైనను రాదు. పెండిలి-ఔపవిభక్తికము కాకున్నను వచ్చెను. పెండ్లిండ్లు. లుః=లుకారము, సంయుక్తసమాప్తౌ, అపి=నామాంత్యాక్షరములతో సంయుక్తమై ముగిసి పోయియును, నామ్నాం=నామములయొక్క, అన్తే=తుదయందు, భూయః ప్రదృశ్యతే=మరలఁ గనిపించును. ఇండ్లులు, కండ్లులు, పెండ్లులు-ఇత్యాది.

---

కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్స్యాత్
ఔపవిభక్తికనామ్నా మత్వం స్యా త్సప్తమీతృతీయార్థే. ౨౦

ఇది రెండుసూత్రములు. కేషాంచిత్=కొన్నియైన, ఉదన్తానాం=ఉకారాంతములకు, నేతి విభక్తౌ=న, అను సప్తమియందు, ఉనః=ఉన్ అనుదానికి, లుక్ స్యాత్=లోప మగును. (మేరువ) చోటున, అనుసప్తమ్యంతమందు, టులోని, ఉకారమును న లోనిపొల్లును గూడి, ఉన్ అగును. దానికి లోపమయిన, "చోట"అని నిల్చెను. ఇటులే, ఊర, నడుమ, మీఁద మొదలైన రూపములు. ఔపవిభక్తికనామ్నాం=ఔపవిభక్తికనామములకు, సప్తమీతృతీయార్థే=సప్తమీతృతీయార్థములయందు, అత్వం స్యాత్=అకారము వచ్చును, విల్లు-అను నౌపవిభక్తికనామమునకు సప్తమ్యర్థమందు, అత్వము వచ్చెను గనుక టివర్ణములోని యికారము అకారమాయెను-వింట, ఇంట, మింట, కంట, ఇత్యాది.

---

అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్యచ సులోపః
ఏదన్తతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్. ౨౧

ఇది రెండు సూత్రములు. అనుతాం=ఉదంత వ్యతిరిక్తము లైన, సమానాం=తత్సమములకు, స్త్రియాం=స్త్రీలింగమందును, సర్వస్యచ=ఉదంతములు సహాగా సమస్తమైన, స్త్రీసమస్య చ=స్త్రీసమశబ్దములకును, సులోపః=ప్రథ

మైకవచనలోప మగును. అంబాశబ్దమున కీసూత్రమున నేకవచనలోప మై "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్" అని హ్రస్వము వచ్చిన, అంబ యని నిల్చును. ఇట్లే గౌరి, వాణి మొదలైనవి. అనుతాం, అన్నాఁడు గనుక, ఉకారాంతములకు లేదు. ధేనువు, చంచువు. వు అనువర్ణకము వచ్చునని మునుపే చెప్పినారము. గోడ, మేడ మొదలైనవి స్త్రీసమములు. ఇయాన్తానాం=ఇయయనునది తుదగాఁగల, నామ్నాం=నామములయొక్క తుదకు, అన్యతరస్యాం=వికల్పమున, ఏదన్తతా చ=ఏకారాంతత్వమును, అగును. గద్దియ, గద్దె-సురియ, సురె-ఇత్యాది. నామాంత్యత్వము గ్రహించుకొని, ముత్తెము, ముత్తియము; విడెము, విడియము-ఇత్యాదులయందును తెలిసికొనునది.

---

వికృతౌ సర్వశబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యేస్యుః
క్లీబసమా అమహద్వత్ స్త్రీవత్స్యుః స్త్రీసమాస్తు సమాః. ౨౨

ఇది నాలుగుసూత్రములు. వికృతౌ=తెనుఁగునందు, సర్వశబ్దాః=దేశ్య శబ్దము లన్నియు, క్లీబసమాః=నపుంసకసమములు ను, స్త్రీసమాశ్చ=స్త్రీసమములును గాని- అన్యే=పుంసమములు, నస్యుః=లేవు. క్లీబసమాః=నపుంసకసమములు, అమహద్వత్=అమహత్తులైన తత్సమములవంటివి యగును. "ము రమహతాం" అని ము వచ్చు ననుట. అందము, చందము, గుల్లము, పల్లము-ఇత్యాది. స్త్రీసమాః=స్త్రీసమములు, స్త్రీవత్=స్త్రీలింగ తత్సమములవంటివి, స్యుః=అవును. హ్రస్వవిభక్తిలోపము లగు ననుట- గోడ, మేడ, మోవి, బావి, చామ, మోరు, పుల్లె, పల్లె, ఎల్ల-ఇత్యాది. సమాస్తు=తత్సమములు, సమాః=యథాపూర్వ సమములై యుండును. రాముఁడు, సీత, రఘుకులము.

శా. కర్ణాంతాయతచారునేత్ర కమలాకర్పూరకూర్చత్రపా
వర్ణ శ్రీకర మంత్రసాధిత విభాస్వద్గ్రావ చిద్గ్రావ సా
వర్ణోదంచిత మంచ బిందు మయ దీవ్యద్దివ్య సింహాసనాం
తర్ణిష్పంద విహార *హారకలికోద్యత్కాంచికాభూషణా.

గద్యము-ఇది శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక మొలకూచి బాలసరస్వతి కవిమహోపాధ్యాయప్రణీతంబైన టీకాగ్రంథంబునం దజంతపరిచ్ఛేదము.

---

* పద్మకలికా—పా.

పాలింప లేఁ డయా ప్రభు వెందు నీకన్న నీకన్నబిడ్డని పేఁక నన్ను
పతితుండు లేఁడయా పరికింప నాకన్న నాకన్నమహినోర్వ నరులలోనఁ
బనుమన్నపాటు లెప్పుడుఁ జెల్పనా విన్న నావిన్నఁదన మింకఁ బోవఁజూడు
గతినీవె లేరికఁ గడతేర్పు నాయన్న నాయన్నమాటల న్యాయ మెంచఁగ
యిది నిజం బని కరుణ వన్నెలి తేని, తేనియవిధంబు నీకథలాన లేన, చారుగాజ
వినిపింతు నిదె నాకవిత్వంబు తాళరా తాళరాగైక్యనృత్యప్రమోద
నీవె దైవము నాకు నీపదమానరా మానరా జాగు రామానుజన్మ
నాకింత కెన్ని జన్మంబులో మెంచరా యెంచ రాయనిసాటిఁ గాంచినవారి
ప్రబలతాపత్రయబాధల కోపరా కోపరాగస్వాంతకుజనదూర
యరసియుఁక నైన నామొఱ నాలకింపు, కింపురుషయక్షగంధర్వకృతసపర్య-
సిద్ధింప నేర్చునే శ్రేయోనిశాంతంబు శాంతంబు నావంటి చపలమతికి
క్షమకూడ నేర్చునే సంపన్నిదానంబు దానంబు నావంటి హీనగతికిఁ
జేకూర నేర్చునే చింతావియోగంబు యోగంబు నావంటి భోగరతికిఁ
బొసఁగంగ నేర్చునే భూతహితత్వంబు తత్త్వంబు నావంటి దైన్యకృతికిఁ
గాన నిటువంటి పతితుఁడ నైన నాకు, నాకుజాతునికట్ల నీనామ మబ్బెఁ, జా.
నీపార్శ్వముల రుక్మిణీసత్యభామలు భామలస్మితముఖులై వసింప
నీయోష్ఠమునఁ గరాన్వితవేణుకాండంబు కాండంబు నించు రాగమున నొప్ప
నీకరద్వయిని మానితశంఖచక్రముల్ చక్రము ల్వెలయు తేజమునఁ దనర
నీమేన నిర్మలహేమాభవాసంబు వాసంబు దీపించు వన్నె నలర
నుదుటఁ గస్తూరితిలకంబు నొదలమించు, మించు నీమూర్తిఁ గాంచి సేవించువాఁడఁ-
భూపీకృతామ్నాయభావనాచరణము ల్చరణము ల్వ్యత్యస్తసరణి నిలిపి
యశ్రాంతసంతోషితాభీరవంశంబు వంశంబు మోవిపై వఱలఁ జేసి
వర్షావసరచర ద్వారిదాబర్హంబు బర్హంబు మౌళి నేర్పడ ఘటించి
దితిభూభయంకర దేవతాసుముఖంబు సుముఖంబు నొరగా సొంపొనర్చి
నట్టి నీదివ్యమగు తేజ మసువియోగ, యోగవేళఁ గనంబడ నోర్పు నాకుఁ
జారుతరమందహాసపోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

— (8) పితృమాతృదశకము. —

కొదలనె బ్రహ్మంబు పదునాల్గుభువనము ల్భువనము లైంకిగాఁ బూనెఁ గుక్షి
నంతనే విభుఁ డాద్యుఁడై మహాదాదుల దాదులఁగా స్వతంత్రత విధించె

తీవి నేమేధావి జీవపార్శ్వస్థుండై స్వస్థుండై వటపత్రశాయి యయ్యుఁ
జెలఁగి యేదేవుండు సృష్టిసంధాతను ధాతను నాభిపద్మమునఁ గాంచె
నట్టినిను దేవకీచండమందు దేవ, దేవ నవమాసములు మోచి తిరుగుటరిది
చాతుతర మందహాస బోలారివాస, వారితాఘతతతృష్ణ మన్నారుకృష్ణ. ౨౧

శంఖచక్రగదాసిసాధన్వశరములు కరములు నాలుగు కరిఁగవిల్ల
ధృతకకీటాధరీకృత భాస్వమస్తంబు మస్తంబు నిస్తులమహిమ నొప్ప
లలిత రేఖాభాసిలక్షణాన్వదములు పదములు పల్లవప్రభల నలరఁ
బూర్ణశశికస్థభూషాని కాయంబు కాయంబు దివ్యముఁగళిఁ దనర
నెనఁగునిటువంటినినుఁ బుట్టింటఁగన్న, కన్నతలిదండ్రులెంతసంపన్నులొక్కొ.

ప్రచలితహిమాద్రిపక్షావిశేషుండై శేషుండై పూని సేజితజమార్తి
విధనిశివేళ నుదధిఁ బొల మత్స్యమై మత్స్యమై త్రిప్పనేమహితకీర్తి
తిరువంగఁ గ్రుంగు మంధానాద్రిఁ గూర్మమై కూర్మమై మోచె నేధగ్గక్షత్రి
యతలస్థమహిఁ దిరస్సృతిసోమఘృష్టియై ఘృష్టియైయెత్తెనేస్పష్టమూర్తి
యట్టినినుఁ గొంచుపసుదేవుఁడతిరయమున, యమునదాఁటి వ్రేపల్లెకునరుగుటరిది

ముందటనిడుకొని ముదుక నేర్పరిపాటి పరిపాటి శైలంబు శిరమునంటి
యూరువులందిడి యుదకశీకరములఁ గరములు సన్నితోఁ గలయ బులిమి
మృదులోష్ణధూతహరిద్రకృజ్జలముల జలముల దోయిట జలకమార్చి
కడువేగముగ మేనితడిని బయ్యెదనంట నిదనంటఁ జేర్చి పెంపొదవనొత్తి
కుత్తుకకు డాయఁ జేతుల నెత్తిపట్టి, పట్టివని ముద్దుగొను తల్లి భాగ్యమే ము-

నిటలస్థలిని జ్యక్షైఘుటియించుఁ గావునఁ గావునఁ బోరిడి కలఁగు వేళ
బొమలక్రిందను రేఖ సమరించు ధసితంబు ధసితంబు కడు దుళ్ళి పడెడు వేళ
నొకచక్కినరక్ష నుంచు నంజనముచే జనముచేకొని ముద్దుగొనెడు వేళ
మొలత్రాట సింగువ ముడిచిన ముడివిట్టు ముడిపెట్టిపుడుడంటి బడలు వేళ
నందసతియిట్లునినులోచనములఁ గాంచి, కాంచినవధూటికధికంబుగాఁగఁ బెంచె-

ప్రక్కలో నిడుకొని పలుమారు జోకొట్టి జోకొట్టి పుణుకుచు జోలపాడఁ
బోరుపెట్టిన భుజంబునఁ జేర్చి చిచ్చోసి చిచ్చోసి యని వ్రేళ్ళఁ జిచ్చుకొట్టి
హాయి రేయనుచు నుయ్యాలనుంచి లాలించి లాలించి మెల్లమెల్లనఁ గదల్చి
బూచివచ్చె నటంచు బుసపెట్టి బెదరించి బెదరించి మీఁగాళ్ళఁ బెట్టియూఁచు
నిన్ను నిన్నివిధంబుల నిద్రఁ బుచ్చి, బుచ్చికొసువంచుఁ దల్లిపాలిచ్చు లేవి, చా.

వనమాలికోవలార్భకుఁడనఁ జనుబాలుఁ జనుబాలు గుడుపవే సమయమునఁగి
విసఁబాలఁ బ్రొద్దైన నమచు నీవెన్నఁగా వెన్నఁగొంచిననేల నన్నుమిడవె
లీల నుయ్యెలఁ బవ్వళించి పెంపొందుగాఁబొందుగానిఁకని ద్రపుచ్చుఁదగదె
తడవాయె నిద్రించి తాళఁ జాఁకలికినో కలికి చేర్పున మేలుకొలుపఁగదవె
యనుచునందుండు నీతల్లిననుచుటప్పు,టప్పటికిఁనిన్నుఁగాంచుమోహమునఁగా దే-
నునురావిశేక నెన్నుదుటిపై వలకల వలకలాపాగ్రణినై మెలంగ
నురమునఁ బచ్చల నొప్పి యొప్పులెగోరు పులిగోరుపతకంబు పొంకమలర
నడుమున మణివితానపు మెఱుఁగంటు గంటలమొలనూలు గల్లురనఁగఁ
దళితశిదివ్యరత్నప్రభావలయము ల్వలయముల్ హస్తాగ్రములఁ జెలంగఁ
దనరునీజానుయానంబు తల్లిచూచుఁ, బాదుకంబులఁ బాలబ్బినొప్పుఁగా దే-
కుడువరాచను బువ్వగడియలోనుకుకునే నునుకునేర్పునమాఁదియిపుడు ననుచు
మీఁగడపెరుఁగుతో మనవుమోగిరము వేగిరము వేడుకసుభాకృతియటంచుఁ
జెచ్చెర భక్షింపు చేకొని యీవెన్న యీవెన్న నేల నన్నెప్పు డనుచుఁ
ద్రాగురా నునువంచదారతో నీపాలు నీపాలు సున్ని లేఁబాప యనుచు
నిత్యమునుజన్నిపాయపునిన్న భూత, భూతదయగల్గుజననియి త్రి బుజ్జగించుఁ-
శింసుమారస్థదివ్యాంశుగ్రహముల గ్రహములఁ దారల రాశికములఁ
బూర్వదిక్పాలాదిపుటభేదనంబుల నంబులఁ దనరునపార్ణవముల
భూజలాగ్ని మరున్నభోభూతగణముల గణముల దివిల నాకాశచరుల
నతలాద్యధోలోకగతఫణీహ్వముల హ్వములఁ జంగమస్థావరముల
మృత్స్నఁగనుమా-చునీపునోకర్తఁగాంచె, గాంచనాంశుక జననినీగర్భమందుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౩౦

## —(4) బాలదశకము. —

నరుల కిందలిజీవనంబులు భంగముల్ భంగము స్త్రీవన ప్రతతియందుఁ
జరము లిందలి గోవృషశ్రీపురగ్నము లగ్నము ల్గన నచరంబు లందు
నమృతాప్తికిందు ననాయాసమథనంబు మథనంబు లమృతసంప్రాప్తికందు
నిందవస్థలమూఁట నందాత్మచర్యలు చర్యలు రెండవస్థలనెయుందు
ననికదా వార్ధిఁదొఁఱఁగి బాల్యమునఁబాడి, పాఁడిపంటలుగల్గు వేపల్లెనుంట
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౩౧

తై-త్తిర ప్రభూతశ్రుతి సారముఁ సారముఁ బొలుకొల్లఁ జప్పరించి
పిదపఁ దజ్జనయిత్రి వృషభపుచ్ఛాకారంబు సారంబుగలతనుస్తవ్యమాని [వి
యుభయసంధ్యలయందునుగ్గునామముదముతో ముదముతోఁ జనుబ్రాలుపీకుకఁ బ్రా
తఃస్నదూరీకృతాజీర్ణవికారంబు కారంబు వారసంగతిని గ్రోలి
యలరితివిగాదెతత్ప్రకావానుభవము, భవముగలవారలకుఁగడాప్రాప్తముగుట-
నులుకకంకటిఁ బ్రాత్తియులఁ గూర్పునెప్పుడి నెప్పుడి చటపలాశమ్ముఁ దలఁప
నెక నెడఁ జనుబ్రాలుగుడుచుఁ దానుకురుచినుకురుచి క్రతువపాహుతిదలంప
వాభీరజనమనోహరణతూవపలీల నవలీల లని విభువ్యక్తి దలఁప
నధిగతదధిభాండ మథనస్వనంబున నంబునర్గ్కి రావంబు దలఁప
నంబహతిభక్తిచే నలోపంబునందు, నందునందు సంపత్తి గనుటనిక్కొందె మఱివు-
వరకుంతలాళిధాన్వన్నుభవస్ఫటుచేఁ బస్నచేఁ గను నొత్తఁబడిన నెవ్వ
పావనకృత్తుంగభంగత్వగంగకు గంగకుభవజనకంబు లెవ్వ
యచలితయోగియోగానుసంధాన ప్రధాన ప్రచారంబు లైన వెవ్వ
సకలవర్ణాశ్రమాచార విస్తుతులందు శ్రుతులందు నృత్యంబు ప్రక్కైనెవ్వ
యిట్టి నీపాదములు నందునింట చెదరి
చెదరికని తప్పటడుగులు పెట్టుటరిది, చారు. ౩౪

అమ్మ పాలివ్వ డిమ్మని పటాంచలముఁ జాచలము చెందఁగఁ బట్టునమయమందు
నమ్మ చెప్పరయొనఁగు మనిమూఁపదంపంబు దఃడంబునిడి పట్టుతలేని మఱియు
నవ్వపెట్టవె బువ్వ యని లీల వ్రేలిచే వ్రేలుదేకొని పట్టువేళయందు
నప్పుచ్చి దే తల్లి యని సుభాకరములు కరము లక్షమువట్టు కాలమందు
నిట్టినీ శైశవక్రీడలింతిమొన్ని, మొన్నికనులున్న మానినీయిష్టమొసఁగుఁ, జారు.
సతతభక్తితమభూమహితసరసాన్నంబు నన్నంబుగాఁ దిన నరణిమనన
సర్వవేదాకృతి శర్కరపలుకులు పలుకులు గడుముద్దుగులుకఁ బలుకఁ
బ్రాణ్యంతరనుగత పాదపల్లవముల లవములగతి వీథి లగుపుతెత్త
శ్రుతిరవాకర్ణనశ్రుతివల్లవార్తల వార్తల పార్థోక్తవ్యక్తి వినఁగ
నేర్చుకొను టద్భుతము గాదె నీవు మంద
మందచర్యలఁ బ్రాకృతుమాడ్కి మెలఁగి, చారు. ౩౫

ఆత్మాలయము దాఁటునంతకు నడుగున నడుగు నవీనరుహాకతనిడుచు
నవలివీథికిఁ బోవునంతకుఁ బదమెత్తి పదమెత్తినన్నగాఁ బాడుకొనుచు

వరసి సేఁత్తలఁ గూడునంతకు నల్లన నల్లనఁ గనువారి నడిగికొనుచు
నచటఁ బెచ్చుక్కి యా నంతకు గొబ్బున గొబ్బునఁ గసరి కేగో యటంచు
నాటలకు వేఁట వెడలి పోయచుచునంత, నంతభూర్తశిఖామణి ప్రతివార, చారు.
అన్న రా మనమాటలాడంగఁ బోవలెఁ బో వలెవాటింకఁ బోనఁగదోయి
తల్లులు గనికొట్టఁ దలఁతురు మనముల మనములఁ గోపంబు మాన రెపుడు
వెన్న దొంగిలి తెత్తు విను మన కిరువుర కిరువు రఘోదరం బీదినంబు
ఆటల కధికుల మయ్యు యాము దలో మాదలోలాస్త్మదింభకులకన్న
ననుచు నమ్మించి సకలగుణాభిరాము
రాముఁ దోడ్కొని రాజమార్గంబుసార వె, చారు. ౩౮
సంహిత విని పదోర్థుఁ బద క్రమముల క్రమములఁ దప్పక ఘనను చెప్పి
సామ చూచి ప్రయోగసంహార మనువుల మనువుల స్మృతికీతిమహిమలెన్ని
క్రియవి క్రియస్థితు ల్గని యాకివృక్షల వృక్షలగతి వివరించి మించి
బనుల నన్నిటిఁ గాంచి బహువిధోపాయము ల్పాయముల్గల వారిఁ జేరిఁ దెలిపి
ప్రబలు నిను ముఖబాహూరుపాదజన్మ
జన్మబాలురు గని నిల్వఁజాల రెదుటఁ, జారు. ౩౯
గళదచ్ఛదధికయఃకణ మై వశీకర శీకరకణము నిరాకరించి
లసరజన్మహితావయవ మై విభూతిద భూతిదవర్చ శంభుని నెదిర్చి
చలదలకాస్య మై జలదతోతాంజనతాంజనగిరి శృంగ మపహసించి
నవనీతదిగ్ధమై నవిధవాభాసిత భాసితహరినీల మోహరించి
భువనమోహనమగునీదుబుధతమూర్తి, మూర్తిమంతంబుఁజూపినార్తినుడుపు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౦

(౫) చోరత్వదశకము.

ఉదయాది సేధనాధ్యుల నైనఁ జిక్కని చిక్కని పెరుఁగు వాసింప జుట్టి
ప్రొద్దు బాపైన నేపుణ్యుల కందని కందని వెన్న నింపొంద మెక్కి
మధ్యాహ్న వేళ నెమ్మది నట్టుగట్టిన గట్టినయంపు మీఁగడలు మెసవి
యపరాహ్ణమున నెత్తునై తడవారిన వారినంటని పాలు వడిగఁ ద్రావి
ప్రతిదినం బిట్టిచోరకర్మ ప్రసిద్ధి, సిద్ధిపడసితి వే మందనుద్ధరింపఁ
జారుతరమందహాస పోలూరి వాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౧

ఉట్టిఁగట్టిన వెన్న నొడియుచు నందక నందకధర కుండవదుము పొడిచి
పులుసైనదధి ద్రావఁగలఁగుచు గడివంచ గడి వంచదార వే కలయఁజేసి
కాఁగుభాండములమీఁగడ లంట లావటి లావరి ధరవానిఁ జోవ నడిచి
కళకళఁజారలు దుగ్ధములావఁదటిగాక దరి కాఁక చవ మధు వరసి నించి
శార్ఙ్గి నీవిట్టులనుభవించ వెయసాధ్య, సాధ్యకర్ముఁడవై బాల్యసమయమందుఁ, జా.

సమయ మెఱింగి వే దప్పుకు గాకుండఁ గాఁగుండలోఁ బాలు గలిది ద్రా
వనులకై దొుకఁబోఁటి చనుచోట నంతలో నంతలోలత వెన్న లరసి స్వీక్రి
త్రచ్చుకవ్వము నిల్పి వచ్చుకాంతను గాంచి తనుకాంచిరవుఁడవైదధిని జొక్కి
పొరుగున కొకస్రేత మెరవడి చన్నంతఁ జన్నంతమీఁగడఁ జాల మెసవి
గండిదొంగలకగ్రేసరుండవైన, వైనతేయాశ్వనాకర్మవసువుగొనుము, చారు.

చలులు స్త్రేఁకటి నిదశిశువులకాఁగిన కాఁగినపాలార్చి కాని కొనవు
ఎటు చలింపనిజాతి కట్టిబా గట్టిది గట్టిది పెరుఁ గైనఁ గాని కొనవు
మిగులఁ గాఁగినపాలమీఁదఁ బాఁగనిపించు గనిపించుమీఁగడఁగాని కొనవు
పెనుగానుచల్లలో మునుఁగక పైనిగ్గు పైనిగ్గు గల వెన్నగాని కొనవు
కోరుకులఁ జోరు లిటు దీర్చుకొనఁగఁగలరె
కలరె నీవంటి కన్నదొంగలు ధరిత్రిఁ, జారు. ౮౮

అంబలోఁ జెప్పెద ననుసారసాక్షిని సాక్షినిదోఁష్టాని చను మటంచు
మరలి వచ్చిన నిన్ను మర్దింతు ననుబోఁటి ననుబోటి నీకుఁ జక్కనెయటంచు
నిరుగువా రెఱుఁగఁ గు య్యిడు మచ్చికంటిని గంటిని నీపాడికలిమి ననుచు
నిన్నేమియనఁజాలనన్న కాంచనగాత్రిఁజనఁగా త్రివారంబుగొనక యనుచుఁ
దాడరి నీవిట్లు స్త్రేతలతోడ మంద, మందలింపవె చోరకర్మముల వేళఁ, జారు.

తెంపరి గాతున్న సంపత్త్రి పెరుఁగునే పెరుఁగు నేఁటి కొనంగు వృథునితంబ
చెనఁటికిఁ బాఁడివృద్ధినిఁ జొందునా పాలు నాపాలు గావింపు నాగయాన
నింపురచ్చలలోన నీహిత వెన్ననా వెన్న నావశము గావింపు తరుణి
తిట్టి నన్నదలింపఁ బట్టకు మీఁగడె మీఁగడ గొనువాఁడ మీనసయన
యని వ్రజస్త్రీల వర్థించి నెనరుగలుగఁ
గలుగని యుపాయముల మంద నలరితౌర, చారు. ౮౯

గోవత్సరావసంకులగృహాంతరములఁ దరములు గడచుకర్థతులఁ జాచి
దంపతీకలహప్రకంపితాలయముల లయములఁ గనని లౌల్యమునఁ జొచ్చి

బాలవృద్ధార్భటీభయదమందిరములఁ దిరము లఘువ్యక్తి నరసిచొచ్చి
వ్యాకీర్ణనిర్లోఘ్యరత్నప్రశ్రీబవంతుల వంతుల నెన్నుచు వరుసఁజొచ్చి
యట్టిసందడివేళల నాడి పాడి, పాఁడి సకలంబుగొని కొల్లలాడితోర, చారు.

దొరకొమకై యుండి దొంగిల నేటికే నేటికేవలులమే నీకు మేము
పూని యేమిచ్చితేము వానికోర్కుల మేలు కులమేలువాని కీగుణము గలదె
రట్టుచేయఁగనందఱము కానివారమా వార మూఁటిడిచేయవలెనెపుడుఁ
గలఁచి హావ్యముల నెంగిలి చేయఁబాడియే పాఁడియేమర్యాద ప్రబలునింక
ననుచు వ్రేతలు కెలుకపసీయంబవారి, వారివారించు నేరని వాఁడవంచుఁ, జారు.

నిలయంబులను జొచ్చు నేర్పు దొంగలయందుఁ గలయందు నెన్నఁడుఁగాననమనుచు
ననుపమాత్మప్రీ నరాద్వైదనామునియందు మునియందుఁ జెప్పఁగావినమటంచు
సంభారచకలంబుశోంపార్భకములందుఁ గములందు నేనాఁడుఁగననుదనుచుఁ
మిథ్యావచోభవామృతము తేనెలయందు నెలయందు నేభంగిఁగలుగదనుచుఁ
బలుకు వ్రేతల యిండ్లలోఁ బాఁడిమరల
మరలఁ జెలరేఁగి కొనవె డింభకులఁ దనుక, జారు. ౪౯

వెన్నలు దినఁ గాంచి వేవేక వాటంబు వాటంబుగాఁ జిల్కు వైచి యోర్తు
పెరుఁగు జిల్లఁగఁ గని బిరబిర బరువెత్తి పరువెత్తి చెప్పఁగాఁ బఱచియోర్తు
మీఁగడఁ జెచ్చర మెసవు రీతిని జూచి తినిచూచి మఱిగినాఁ డనుచునోర్తు
పాలు ద్రావఁగ నోర్వఁ ధరపై విలోకించి లోకించిదనుకంప లేక యోర్తు
తల్లి కెఱిఁగి పనిను లోటఁద్రాటఁగట్టి, గట్టిపనిసేయదే చోరకర్మవేళఁ
జారుతర మందహాస ఘోలారివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౦

(6) జారత్వదశకము.

విలసితకుందకుట్మలసుందరరదముల్ రదముల ముద్దిడఁ బెదవి నొక్కి
విస్ఫురత్తరముల నిజతలికుచములఁ గుచముల జంకఁగొనఁ బట్టి
తొడలపై నిడుకొన్న వడిసాభిమానంబు... ... ... ... ... ... ...
యెదుట నిల్చిన మీఁది కెగసి లోనలుగఁగా నలుగ గాఢాలింగనం బొనర్చి
బాలుఁడని చేరు చెలులపై భ్రాంతిపడుచుఁ, బడుచుఁదనమునసీరీతిఁ బ్రబలితోర
చారుతరమందహాస ఘోలారివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.

గోపులఁ గని భీతిగాను వానిగతి వేగ గతివేగమున వచ్చి కౌఁగలించి
మేల దాఁచెదు పైఁట నిచ్ఛానఫలముల ఫలముల నని కుచంబుల గ్రహించి

బింబ మొంగిలి చేయఁ బిన్నవు గావింపు గావింపు మిదియని మోవిగఱచి
నీవిపీడ బిగింప నెత్తు నీమనుచుని మనుమని... ...... ......
లేని నెపములనిట్లుగల్పించికొనరి,కొనరి వ్రేతలమానంబుగొంటివౌర,చారు॰

తల్లిదండ్రించ నింతకుఁ గన్నెలుంగుదు రంగుదుకూలాంతరమున రమణి
నిదుర వచ్చినిశయనింతు వంచలములోఁ జలము లో నెడలింపు చంద్రవదన
కలివచ్చునంతకుఁ బవళించి చనువాఁడ చనువాఁడవారిదే ఘనము కలికి
యిలు నేరలేని పెన్నిరుల నొక్కడ నేఁడు కడనేఁడుగడ నేని కంబుకంఠి
యనుచు నీరీతి సమరోత్తు లాడు దరసి
యరసి వ్రజమెల్ల జారశేఖరుఁడవగుచుఁ, జారు. ౯౩

పతి యూరలేఁడని పతినిసేఁ గలుగంగఁ గలఁగంగ నేటికే జలజగంధి
దొడ్డికిఁ జనినవాఁడుఁడు వచ్చునంతకు నంతకు నేఁ జాలనా లతాంగి
యలిగి పోయినమనోహరుని బిల్వఁగనేల వగ నేలలేని నిన్నిగురుఁజోఁడి
వరుఁడు దూఱుట నవ్యతరుణి గామించునే మించునే నీమాటచంచలాక్షి
చనుబాలుఁడనాసురసప్రబంధ, బంధములనేరుననిపల్కి ప్రబలితౌర,చా॰

లలితదుగ్ధ్విజిత పల్లవిత తాపింఛంబుఁ బింఛంబు నొఁదల బిగియఁ జుట్టి
మృదులనాదసుధాఝరీ నిరర్గళమున గళమున వనమాలికలు ధరించి
రంగుబంగరుచాలు చెంగులువారఁగా వారగాసైవలెవాటునైచి
జనితామృతాధరం బనుపవదంబున దంబున వేణుకాండంబు నిలిపి
గాన మొనరింప విని తాళమాన మెంచి
మెంచి వ్రేతలు నిన్ను మోహించి రౌర, చారు. ౯౪

గోపికల్ గ్రుంకుచుఁ గొలనిలో నుండఁగా నుండగాఁ జీరల నొడిసికొనుచుఁ
దీరభూజము నెక్కి తెగడుసుందరులను దరులను జేరఁగాఁ దలఁచికొనుచు
నలయించునిన్ను మాయాత్మలాకులముగాఁగులముగాదన చెయ్యాకొలఁతనుచు
దిరుగ మాకిష్ట డంబరముల నొప్పింపు నొప్పింపవలదు సుస్మితవదనుచు
హస్తములు మోడ్చి మ్రొక్కు రామాభిమాన
మానములుగాచి పటములు మరలనిడవె, చారు. ౯౫

భవరాగమకరంద విపులకంకాసార కాసారముల జలకంబులాడి
తు కుసుమాదినరాగశంకితచిత్రాంశు చిత్రాంశుకముల నచ్చికధరించి